రథము రాజప్రాసాదపు గశాల ఆగింది. సీతారాములు రథావరోహణము చేశారు పురంధ్రీమణులు నీరాజనాలు సమర్పించారు రాముడు రాజభవనాన్ని ప్రవేశించాడు. ముగ్గురు తల్లులకు నమస్కరించాడు పితృమందిరాన్ని సుగ్రీవునికి విడదిగాయియ్య బడింది వశిష్ఠాది మునుల ప్రోత్సాహంచేత సుగ్రీవుని ఆజ్ఞచేత రామ పట్టాభిషేక నిమిత్తము 500 మహానదుల జలం వానరులచే సేకరించ బడ్డది

సుషేణుడు తూర్పు సముద్రంనుండి, వృషభుడు దక్షిణ సముద్రం నుండి, గయుడు పశ్చిమ సముద్రం నుండి, నలుడు ఉత్తర సముద్రం నుండి బంగారు కలశలతో సముద్రోదకాలు తీసుకొచ్చారు

అయోధ్యా అభిషేక మండపము సహస్రస్తంభ నిర్మితము అందనేక కాంచనవేదికలలంకరింపబడి ఉన్నాయి. కుడ్యాలందు మహాప్రాచీన చక్రవర్తుల ఆలేఖ్యములు వ్రేలాడుచున్నాయి సమశీతోష్ణస్థితి కలిగియున్నదా మండపం సుదూర దర్శనశ్రవణాన్కి అనుకూలత కల్గిఉన్నది. వివిధ విధాసనాలు కలవు. మణిమయ దీపాలంకృతమై యున్నది వివిధవర్ణ చిత్ర విచిత్రకౌసేయ వస్త్రాలంకృతమైన ద్వారములు వాతాయనములు కలవు చూతపల్లవ మౌక్తిక తోరణాలంకృతమైంది, ద్వారాలకిరు పార్శ్వముల పూర్ణ కుంభాదిశోభితమైంది ఆ అభిషేక మండపము.

వశిష్ఠవారు దేవనారధ జాబాలికాశ్యపాది పురోహితులు పౌరులు, జానపదులు, మంత్రులు, సామంతులు, బంధువులు మిత్రులు యథాస్థానాలలో అధిష్టించి యున్నారు. లాజాక్షత కుసుమ పల్లవ దధిక్షీరఘృతాదులు సేకరించబడ్డాయి, కృష్ణాజినము,వ్యాఘ్రాజినము, ఉత్తరణం సింహాసన సమీపానకలవు వాటి పై వశిష్టాదులు

కూర్చుని యున్నారు. వివిధ వాద్య విశేషాలు శ్రావ్యంగా మ్రోగుతున్నాయి.

రత్న మయ సింహాసనమును సీతారాముల నధిష్టింపజేశారు పురోహితులు ఓషధిపురస్కృతములై పంచత్వక్ పంచిపల్లవశోభిత ములై మంత్రితమున సువర్ణ కలశలతో సముద్రోదకములతోనూ నదీ ఉదకాలతోనూ మునుముందుగా వశిష్టాది పురోహితులు —యత్రాద్యది చంధములతో "మిత్రోసి, వరుణోసి, ధృవంత" మన్త్ర వీర్యవంతములైన మంత్రాలు పటిస్తూ సీతారాములకభిషే కం దేవతలు దేవేంద్రునికివలే ఋత్విక్కులు సీతారాములకు అభిషేకించినపిదప, కన్యలు, మంత్రులు, సామంతులు యోధులు తక్కంగల పెద్దలు పసన్నములై సుగంధభరితాలైన తీర్ధములను అభిషేకించారు.

బ్రహ్మచే నిర్మితమైనది మన్వాది సామ్రాట్టులు ధరించినది నవరత్న నిర్మితమైన కిరీటాన్ని బంగరుపళ్లెరము నుంచి పూజించి "ఆయుర్దదాతీతి" మంత్రమునుచ్ఛరిస్తూ వశిష్ఠుడు శ్రీరామచంద్రుని మస్తకము నలంకరించాడు "శ్రీరామచంద్రునికి జై" అంటూ ఎల్లరూ జై జై ధ్వానాలు చేశారు. సుగంధభరితమైన చల్లని గాలి వీచింది పుష్పవృష్టికురిసింది. దేవదుంధుభిలు మ్రోగినవి గంధర్వులు గానం చేశారు అప్సరసలు నాట్యం చేశారు.

ఇంద్రచోదితుడైన వాయువు శతసువర్ణ పుష్పమాలికను శ్రీరామునికి కానుకగా సమర్పించాడు.

శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ సమయంలో భూమి సస్యవతియైనది. పాదపములు ఫలవంతములైనవి. పుష్పములునూ సుగంధ భరితములైనవి

లక్షలాది ఆవులు, గుర్రములు, వృషభములు, స్వర్ణాదులు బ్రాహ్మణుల కిచ్చారు. మణి విగ్రహంతో కూడిన స్వర్ణహారమును సుగ్రీవునకొసగినాడు వజ్రవైడూర్యములతో కూడిన అంగదములు అంగదునికి బహూకరించాడు. మణులతో కూడిన ముత్యాలహారాన్ని సీతాదేవికొసగినాడు శ్రీరామచంద్రుడు

సీతాదేవి రత్నములతో కూడిన మౌక్తికహారమును చేత ధరించి శ్రీరామచంద్రుని ముఖమునవలోకించినది. ఇంగితజ్ఞుడైన శ్రీరామచంద్రుడు " బలపౌరుషాలచేత శక్తిసామర్థ్యాలచేత నీవు ఎవని యందు సంతుష్టిచెందినావో వానికొసగుమని " పలుకగా వెంటనే ఆ హారమును వాయుపుత్రుని కొసగెను.

వస్త్రాభరణమాల్యాదులు, ఎవరికి ఏమి యొసగిన సంతుష్టి నొందెదరో వారికి అన్ని శ్రీరామచంద్రుడొసగి సత్కరించాడు. సుగ్రీవాది వానరులు విభీషణాది రాక్షసులు, సఫలీకృతమనోరథులై పరమానందం నొందారు

ఎల్లరూ, ఎల్లకామ్యాలు పడసి సీతారామ లక్ష్మణులకు నమస్కరించి అనుమతిని పడసి తమతమ దేశములకు వెళ్లిపోయారు విభీషణుడు ఇక్ష్వాకుల నుండి కులదైవమైన రంగ మందిరాన్ని ప్రతిగ్రహించి లంకానగరానికి వెళ్లాడు

యువరాజ్య పదవినందు లక్ష్మణుడు అంగీకరించని కారణమున భరతుడు అన్న ఆజ్ఞననుసరించి యువరాజ్య పట్టాభిషిక్తుడైనాడు. శ్రీరామచంద్రుడు శతాశ్వమేధావి క్రతువులాచరించి ప్రజారంజకుడై పదకొండు వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసినాడు.

48307

# ఇతర రచనలు

ఆదర్శజీవి

హయగ్రీవ శతకము

శ్రీసూక్తము ఆంధ్రీక్యం

మాయావతి

పుష్పాశయం

ప్రగతి

సిత

సితాకళ్యాణం

పురుషోత్తముడు

సల్లాపముది

బడిపిల్లలు

సీతారామసుప్రభాతం

ఆంధ్రరాష్ట్రం

ద్వాదశాక్షరిస్తోత్రం

ఛాందోగ్యోపనిషత్

హాటకేశ్వర విలాసం

అభ్యుదయం

కర్మభూమి

ఈశావాస్యోపనిషత్

పాంచరాత్రం

భారతీయ మతవాహిని



రచయిత - దంపతులు

చామర్తి కూర్మాచార్యులు

చామర్తి అలివేలమ్మ